చుందురు. అందువలన ఇక్కడ పరిశుభ్రత ఎక్కువగానుండవలెను. విదేశములనుండి వచ్చిన యాత్రికులను మన మత్యంత ప్రేమతో చూడవలెను. వారికి భారతీయుల ప్రేమానురాగములు అతిథిపూజ, మొదలయిన సద్ధర్మములన్నియు వెల్లడికావలెను."

నేటి ఉపన్యాసమునందు వినోబాజీ నవభారతముయొక్క వైదేశిక నీతిని బోధించుచుండెనా యన్నట్లుండెను. అశోకచక్రవర్తి వైదేశిక నీతి కూడ అదే గదా! అస్తమించుచున్న సూర్యుని కిరణములు బౌద్ధదేవాలయ కలశముపైన "ధర్మచక్ర ప్రవర్తనము" అను వాక్యమొక్కటియే వ్రాసిపోయినట్లు తోచెను.

సూర్యాస్తమయమయ్యెను. కాని దీప సమూహముల సౌమ్య కాంతులవల్ల బుద్ధదేవాలయము నవ్యతేజస్సుతో ప్రకాశింపజొచ్చెను. హారతికి వేళఅయినది. గంట మ్రోగుచుండెను. బుద్ధభగవాను డా సమయములో నాలోని నాస్తికత్వము నంతటిని పోగొట్టెను. నాకు తెలియకుండగనే భక్తిచే, నేను చేతులు మోడ్చి నమస్కరించితిని. రంగూన్ విద్యాపీఠములో చదువుచున్న బర్మా విద్యార్థిని ఒకామె నా ప్రక్కను కూర్చుండి మెల్లగా, "బుద్ధం శరణం గఛ్ఛామి" అనుచుండెను. ఆ మంత్రము నా వీనులలోను, హృదయములోను ప్రతిధ్వనించుచుండెను. అశోక కుమార్తెయయిన సంఘమిత్ర ధర్మచక్ర ప్రవర్తన కొఱకు, ఈ మంత్రమునే ఉచ్చరించుకొనుచు ఏ మందిరము నుండి వెడలిపోయినదో, ఆ మందిరము ఇదే. "నీవేమిచేయుచున్నా" వని సంఘమిత్ర నన్నడుగుచున్నట్లు తోచినది.

ఈనాడు కాలము, "నీకేమి కావలెను, సర్వోదయమా ? సర్వనాశనమా ?" అని మానవు నడుగుచున్నది. ప్రతి వ్యక్తియు ఈనాడే ఈ ప్రశ్నకు సమాధానము చెప్పితీరవలెను.

"నీవు నీ హృదయమందిరమున అహింసాదేవిని ప్రతిష్ఠించుకొన్న యెడల, అహింసా ధర్మము నీ జీవితములోని ప్రతి రంగము నందును ఉపయోగించుము." "వ్యక్తి యొక్క చిత్తశుద్ధి, సామాజిక క్రాంతి— ఈ రెండును ఒక్కటే, అభిన్నములయినవి."

"నీవేమి చేయుచున్నా" వని సంఘమిత్ర మాటిమాటికి అడుగుచున్నది.



పదయాత్ర చేయడంలో దమ్మిడీ కూడా ఖర్చు గాదు. ఒక ప్రాంతంనుంచి మరొక ప్రాంతానికి వెళ్ళి పరిచయం సంపాదించుకోవాలంటే పదయాత్రను మించిన ఉత్తమ సాధనం వుండబోదు. యువకులు రెండేసి నెలలు, మూడేసి నెలలు యిలా పదయాత్ర చేస్తే నిరీక్షించి గమనించడం పెరుగుతుంది. ప్రేమ భావం వర్ధిల్లుతుంది. జ్ఞాన ప్రచారం అధికమవుతుంధి. ఈ విధంగా మనదేశంలో యిదివరకు పర్యటించేవారు. నానక్, నామదేవ్, మాణిక్యవాచర్, శంకరాచార్యులు, రామానుజాచార్యులు, చైతన్య మహాప్రభు యీవిధంగా వందలకొలది ఉదాహరణలు మనముందు ఉన్నవి. దీనివల్ల మీరు వెనుకబడెదరని భావించకండి. పదయాత్రలో చైతన్యలక్షణ ముంది. దానివల్ల మనిషికి దీర్ఘాయువు లభిస్తుంది. కాలినడకన వెళ్ళుటలో సమయం ఎక్కువపడితే ఆయువు పెరుగుతుంది. "మా దగ్గర సమయం లేదు. పనులు త్వరత్వరగా కావాలంటే దేవుడుకూడా తనపనిని త్వరత్వరగా చేస్తాడు. ఘుష్ఫయి సంవత్సరములు రాగానే ఇక బయులుదేరు అంటాడు. నల్భై సంవత్సరాలకే యీ ప్రపంచమును వీడవలసి వస్తుంది. మానవుడు నిద్రించునపుడు కలియుగంలో వుంటాడు. పక్కవదలి లేచి కూర్చుంటే ద్వాపరయుగం లోనికి వస్తాడు. లేచి నిలుచుంటే త్రేతాయుగంలోనూ, నడవడం ప్రారంభిస్తే కృతయుగంలోనూ వుంటాడని మన స్మృతులు చెప్పాయి. అందుచేత మనం దేశంలో కాలినడకన ప్రచారం చెయ్యాలి. పదయాత్ర భారతీయ ప్రచార రీతి."

— వినోబా.

# సర్వోదయ భూదాన సాహిత్యము

| | | |
|---|---|---|
| గీతాప్రవచనములు | వినోబా | 1—0—0 |
| వర్తకులకు పిలుపు | ,, | 0—1—0 |
| గిరిప్రవచనము | ,, | 0—1—0 |
| మనఐక్యత-గ్రామ ఆరోగ్యము | ,, | 0—3—0 |
| పవిత్ర సన్నివేశములు | మృదుల మూందడా | 0—8—0 |
| వినోబాజీ జీవితం | లవణం | 0—3—0 |
| విద్యార్థులారా రండి! | ,, | 0—2—0 |
| భూదాన ఆరోహణము | నారాయణదేశాయి | 0—12—0 |
| సంపత్తిదానము | కృష్ణదాస్ జాజూ | |
| జీవనదానము | జయప్రకాశ్ నారాయణ్ | |
| సామ్యయోగపథముపై | దాదా ధర్మాధికారి | |
| భూక్రాంతి వెల్లువ | మనమోహన చౌదరీ | |
| సర్వోదయ చరిత్ర - శాస్త్రము | శంకరరావ్ దేవ్ | |
| శ్రమదానం | శివాజీ భావే | |
| శిక్షణవిచారధార | వినోబా | |
| సాహిత్యం - సాహితీవేత్తలు | ,, | |
| కాంచీపుర సందేశం | ,, | |

*ధరలు వేసిన పుస్తకములు అచ్చు అయిఉన్నవి. మిగిలినవి త్వరలోనే వెలువడ నున్నవి.*